ఉ. ఎక్కడ నున్నఁ దేఁగల వహీనబలాఢ్యుఁడ వౌదు నిక్కడం
జిక్కినకార్యముల్ దడవుసేయక సేయు మటంచు నక్కునన్
గ్రక్కున మక్కువం బొదివి క్రమ్మఱ మూర్ధముఁ జక్కి మూర్కొనన్
జొక్కపుబత్తి నిక్కి నృపసోముని కాయన మ్రొక్కి యిట్లనున్. 43

హనుమంతుఁడు బ్రహ్మలోకమునుండి గంధమాదనుం దెచ్చుట

ఉ. హెచ్చన నేల? శ్రీరఘుకులేశ్వర! యిప్పుడె మృత్యుగర్వమున్
ద్రచ్చెద దండపాణిభటవర్గముతోఁ బడఁబెట్టి యావలన్
జొచ్చెద నందుఁ జూడఁగలచోటులఁ జూచి నిమేషమాత్రలోఁ
దెచ్చెద గంధమాదనుని దేవర! చూడు మటంచు నుద్ధతిన్. 44

సీ. పెళ పెళ పెళ నూర్ధ్వభీకరార్భటులచే దిక్పాలికండియల్ దిగ్గుమనఁగ
బిర బిర బిరఁ ద్రిప్పుపృథువాలవిస్ఫూర్తిఁ దూలంబులై గిరుల్ తోనెగయఁ
గహ కహ కహ నవ్వుకఠినాట్టహాసంబు సురలఁ గాంతాశ్లేషసుఖులఁ జేయ
బిస బిస బిసఁ బోవు వెనువీఁక నిలలేక పైమేఘములు పటాపంచలుగను

తే. సుప్పరమునకు గుప్పించి యుబ్బి గబ్బి
నిబ్బరంబున సంయమనీపురంబు
ద్వారమునఁ జేర్చి యార్చినఁ దత్తఱిల్లి
యముఁడు పఱతెంచి పూజించి సంభ్రమమున. 45

క. సద్భావ మెసఁగ నిట్లను, మద్భవనమునందు గంధమాదనకపి లేఁ
డద్భుతవిక్రమ! సరసిరుహోద్భవు వెస నిప్పు డాతఁ డున్నాఁ డనినన్. 46

ఉ. మంచి దటంచు మ్రొక్కి పవమానకుమారుఁడు భూర్భువర్మహో
దంచితపుణ్యలోకములు దాఁటి క్రమంబున సత్యలోకముం
గాంచి తదీయవైభవము కన్నులపండువు సేయఁ బోయి య
క్కాంచనగర్భుఁ డున్నమణికాంచనకూటము సొచ్చి యచ్చటన్. 47

సీ. ద్వాదశార్కకిరీటతటనీలరుచు లంఘ్రిపద్మంబులకు మధుపములు గాఁగ
నమరఫాలన్యస్తసహస్రాంజలులు కిరీటికి బద్ధకోశమాలికలు గాఁగ
నటనలీలాప్సరఃకుటిలాలకాలోకనంబులు నీరాజనంబు గాఁగ
వర్ణనాయితయతీశ్వరభాష లాత్మచారిత్రపద్యలకుఁ గీరికలు గాఁగ

తే. దనసుతుండు వీణె వినిపించువిధమున
కెవ మయూరంబుగాఁ గూరి యిగురులొత్త

వాసరస్వతిఁ గూడి పద్మాసనమునఁ
గమలగర్భుండు పేరోలగమున నున్న. 48

తే. అచ్చటికిఁ జనంబు వన మేసి వచ్చనిబిగి, కచ్చెరువుఁ జెంద నలువకు వచ్చి మ్రొక్క
గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చి నీవచ్చుటేమి, మచ్చిక వచింపు పవనకుమార! యనిన. 49

ఉ. అక్కపిచంద్రుఁ డిట్లను మహాత్మ! సమస్తము నీ వెఱుంగవే?
యిక్కడ గంధమాదనకపీశ్వరుఁ డుండు టెఱింగి వచ్చితిన్
గ్రక్కునఁ బంపు మక్కపిశిఖామణిఁ జూడక పోవకున్నవాఁ
డక్కడ రాముఁ డన్న విని యాతని నిచ్చె విధాత యిట్లనున్. 50

ఆ. ఇతఁడు రామకార్యహితబుద్ధి ఘటకర్ణు, మేన నలఁగి తొంటిమేను మాని
యజరుఁ డమరుఁ డయ్యె నవని కంపఁగఁజెల్ల, దైన నీవు రాఁగ నంపవలసె. 51

క. తను వుడిగినజనుఁ గ్రమ్మఱఁ, గొనితెచ్చెద ననుచుఁ బూనుకొని రా వశమే?
వినుత ప్రభావతేజో, ఘని వగఁ బేయుందె చెల్లఁగాక మహాత్మా! 52

మ. అని సార్థంబుగ బ్రహ్మ సన్నుతులు సేయన్నమ్రుఁడై గంధమా
దనునిం గౌఁగిటఁ జేర్చి తోడుకొని రాఁ దత్తజ్జగద్వర్తనుల్
ఘన తేజోబలధైర్యశౌర్యమహిమల్ వాక్రుచ్చి వర్ణింపఁగాఁ
జనుదెంచెన్ రఘురాముచెంత కఖిలాశ్చర్యప్రభావోన్నతిన్. 53

సీ. వచ్చితె మాతోడినెచ్చెలితన మీవు మఱచితో యని చెంతఁ దిరుగువారు
నీవు లేకుండిన నెందఱు లేనట్టు లుండె మా కని చేతు లూఁచువారు
ఎచట నేతెంచె నీ కిటువంటిదేహంబు మరలనం చంగంబు లరయువారు
నా పేరు దెల్పుమా నాఁడు నే నే మంటి నని తొంటిచందంబు లడుగువారు

తే. ఎచటనుంటివి? మముఁ బాసి యిన్నిదినము, లెటుల నచ్చోటి కరుదెంచె నీమహాత్ముఁ
డనుచుఁ గపు లెల్ల గంధమాదనునిఁ జుట్టుకొనిరి మృతజీవిఁ గ్రమ్మఱఁ గనుటఁ జేసి.

క. అనిలజ! నీవె విధాతవు, వినుమది గాకున్న మృతుని వెనుకొని మరలం
గొనితేవచ్చునె? యితరుల, కని కపివిభు లెంచ స్వామి కనిలజుఁ డంతన్. 55

తే. వినయమున మ్రొక్కి గంధమాదనవనాటు, చంద్రుఁ బొడగానిపింప నాశ్చర్యమంది
మెచ్చి కౌఁగిటఁ గ్రుచ్చి భూమిపతి యపల, సేతుతటమున శివుఁ బ్రతిష్ఠించె ననిన.

ఉ. గౌతమసూతి పల్కె ననఘా! మును రాముఁడు శంభులింగము
న్సేతువుభూమి నేమిటికి నిల్పె నకో? పవమానసంభవుం
డాతఱి నేమియైన విహితాద్భుతకర్మము లాచరించెనో!
చేతన కింపు గుల్కఁగ వచింపు మనంగ వసిష్ఠుఁ డిట్లనున్. 57

డు లింగప్రతిష్ఠాపనంబున కభంగురమాంగల్యముహూర్తంబు ప్రసంగించి మునిపుం
గవులవలన ముహూర్తద్వయమాత్రంబుగా నెఱింగి కుఱంగటం జెలంగుసమీర
కుమారుం గనుంగొ 66

క. కల దరాకరమునకు దగినలింగంబు నాల్గుగడియలలోఁ
వలయును నట పోయి తెమ్మా! వలయుదువే యొట్టిపనుల కనిలకుమారా. 67

మ. అనినన్ సామి! హసా వటం చకోఁడు బాహాస్ఫాలి యై గంధమా
దన మిట్టట్టయి యూఁగఁగా నెగిరె గంధర్వాప్సరస్సిద్ధసా
ధ్యనిశాటోరగకిన్నరప్రముఖు లాహా యావిజృంభంబుతో
నను కైలాసమె తెచ్చునో యని జవౌన్నత్యంబు వర్ణింపఁగాన్. 68

తే. ఎగిరి కైలాసగిరిఁ జేరి తెగువ మీఱి, యల్లసామీరి శివలింగ మందు వెదకి
వెదకి కానక కానకవిభుఁ దనర్చు, నచటఁ గానక వెఱఁగంది యందు నిలిచి.

మ. చరణాంగుష్ఠముచేత నూఁతగొని పక్షద్వంద్వమున్ విచ్చి భా
స్కరు దృష్టించుచు నూర్ధ్వబాహుఁడయి నిశ్వాసంబు బంధించి బం
ధురవిశ్వాసముతోఁ దపంబు సలుపన్ దోడ్తోన ప్రత్యక్షమై
హరుఁ డిష్టార్థము వేఁడు మన్న వినతుం డై పల్కె సద్భక్తితోన్. 70

కందద్వయగర్భితసరసిజవృత్తము.—

వినా నిన్నున్ ధ్యానమహీనావృతి గొని కచుఁగొన నెద నహహా మహా
మానిశానుల్ భానుసమానుల్ మది నిజ నెఱుఁగక మనికితపడఁగా.
నీనామంబే లోనిడినే నంతటిమిఁ గొలువఁగ నెవరునఁ దనరన్
సానందోక్తుల్ మానక యా నంచని మనుపఁగఁ దగు దనదృశనయనా! 71

కందద్వయగర్భితభాస్కరవిలసితవృత్తము.—

తాపము గెడపఁగ నోపినచూపున్ దాపసమనసుల సొబగగురూపున్
పాపపుదనుజుల మాపినమేపున్ బంకజవదనకు హితవగుతూపున్
గోపురవిలసన మాఁపినమూపున్ ఘోరహలాహలము మొనసినమేపున్
గోపతిగమనము చూపినకోపున్ గూడితనరునినుఁ గొలిచెద నభవా! 72

స్రగ్విణీభుజంగప్రయాతగర్భితవృత్తము.—

శ్రీకపర్దీ! మునిశ్రేయ! కామాపహారీ! కృపావార్ధి; నీరేజహృచ్ఛేకరా
ధ్యా! కపాలస్ఫురద్ధస్త! గందేభదారీ! కపోలోజ్జ్వలశ్రీ! జగజ్జీవనా! 73

తే. వేళ తప్పక రమ్మని విభుఁడు పల్కె, నిష్టమొనఁగూర్పవే యన్న నీశుఁ డలరి
యతని కప్పుడు లింగద్వయం బొసంగి, తత్క్షణంబునఁ జూడ నంతర్ధిఁ జెందె. 74

ఉత్సాహ.—

అంత నిందు మానిచంద్రు లాంఛనోపుఁ డేమి య
త్యంతతామసుండు చేసె నయ్యొ వేళ నిర్మల
స్వాంత సీత చేసినట్టి సైకతంపులింగ మీ
వింతలోఁ బ్రతిష్ఠ సేయు మేలవేళ పోవఁగాన్. 75

సీ. అనిన మంచిది యంచు నజ్ఞానకీనేత సీతతో మంగళస్నాత యగుచు
జ్యేష్ఠమాసంబున సితపక్షమున దశమిఁ జంద్రసుతవారమునను హస్త
తారను గరకరణారూఢ మగువ్యతీపాతయోగంబున భాస్కరుండు
వృషభంబునను గన్య నిందుఁ డుండెడుమహాపుణ్యదలగ్నయోగమునను గంధ
తే. మాదనాచలమున సేతుమధ్యమునను, జేసె లింగప్రతిష్ఠ ప్రసిద్ధి
నఖిలలోకప్రతిష్ఠాక కట్టివేళ, నఘహృల్లింగప్రతిష్ఠ యద్భుతంబ కాదె. 76

సీ. ఆవాహన మొసఁగి యర్ఘ్యపాద్యము లిచ్చి భక్తితోఁ బురుషసూక్తనమక
చమకాదివేదమంత్రములతోఁ బంచామృతస్నాన మొనరించి పవనసంభ
వానీతగంగాదికానేకతటినీజలంబుల నభిషేచనంబు చేసి
వసనవిభూషాదు లొసఁగి శైవసహస్రనామంబులను బూజనంబు సలిపి
తే. ధూపదీపంబు లొసఁగి దోడ్తోడ షడ్రసాన్ననైవేద్య మర్పించి యంత వీటి
కార్పణంబుఁ బ్రదక్షిణమాచరించి, సన్నుతిఘటించె శ్రీరామచంద్రుఁ డపుడు. 77

నాగబంధము.—

చ. జయ జయ సామగేయ! హర! సారసగర్భశిరోహరా! పురం
జయవిమలాభిధేయ! మృగసంగతహస్త! మఖాతిభంగదా!
భయదహనాగణేయ! భవభావజగర్వభిదా! యమోహ! మ
వ్యయమతిదా! శివా! యసురవారకపుణ్యద! రామలింగమా! 78

కంఠగర్భితమణిగణనికరము.—

తొగదొరజగిబిగి దొరసినసిగయున్, సెగగను కనుఁగొనఁ జెనకినపగయున్
మగువ సగము గలమయినిగనిగయున్, నెగడిన మనికిఁ దెలిపెన నభవా! 79

అనులోమవిలోమకందము.—

ధీర హిమభామహి రథీ, తారరనా మదహరాహదమవారరతా
మారవరవీరపరమా, సారసదాయద జరాధరయదాసరసా. 80

పంచచామరము.—

ధరాధరాధిరాజభూసుధాధరాధరాధరా!
ధరాధరాతిదూరసారదాచ్ఛకీర్తిసుందరా!
పురందరావరాగదారణాపురందరా!
సురాసురస్థిరాసురార్చ్యశుద్ధమూర్తిభాసురా!

తే. అని నుతించినఁ బ్రత్యక్షమై శివుండు
మారు నిల్పినలింగ మీమీఁద సకల
పూజ్యమును దోషహరమును బుణ్యఫలవి
ధాయి యగునిక్క మని యేఁగెఁ దక్షిణంబ.

తే. శ్రీరఘుస్వామి గంగాభిషేకమునకుఁ
జనశుద్ధోదకములకై తత్సమీప
ధరణిఁ దనవింటికోపునఁ ద్రవ్వ నూయి
సేయ నది కోటితీర్థప్రసిద్ధిఁ గాంచె.

ఆ. వినినయంత సుకృతవిభవరీతు లమర్చుఁ
గనినయంతఁ బ్రకృతికడకుఁ జార్చు
శుభము లొసఁగ నేర్చు నభిమతం బొనఁగూర్చు
కోటిసరము కలుషకోటిహరము.

తరల.—

సురమునీంద్రులు సిద్ధసాధ్యులు శోభనక్రియ జానకీ
వరునిలింగము పూజసల్పిరి వానరుల్ పరమానురా
గరసవారిధి నోలలాడిరి కంజగర్భదిగీశ్వరుల్
పరమభక్తి నుతించి రన్నను బల్కె శ్రోత వసిష్ఠతోన్.

క. కాలము దప్పక రమ్మని, లాలించి మరుత్సుతుని నిలాపతి పనుపన్
గైలాసంబునకుం జని, యాలస్యము చేసెఁ దెలుపుఁ డతనికత యనన్.

చ. మునిపతి గౌతమాత్మజుని మోము గనుంగొని పల్కె నీగతిన్
దినకరవంశుఁ డీశ్వరుఁ బ్రతిష్ఠ యొనర్చినమీఁద వాయునం
దనుఁడు నమందబుద్ధి శివదత్త మహోత్తరలింగయుగ్మముం
గొని ఘనవేగి యై గిరులు ఘూర్ణిల వచ్చుచుఁ ద్రోవలోపలన్.

ఉ. ఉగ్రమయూఖవంశుఁడు ముహూర్తము దప్పక లింగమూర్తిఁ బ్ర
త్యగ్రవిధిని నిల్పఁడుగదా! జగదాదరణీయకీర్తి మ

జాగ్రదుదారబుద్ధిఁ గనఁజాలక యింకటిలోన నన్యలిం
గగ్రహణంబు సేయునె విచారము చెల్ల చటంచు ముంగలన్. 88

సీ. జడి వట్టి కురియునిర్ఝరులపూవులసోనతావిఁ జెంపెడుమిళిందములమ్రోఁత
బెళుకుఁజూపులుమించుకళుకు మించ నటించుతెఱఁగంటిచెలులయందియలమ్రోఁత
జయ రాజశేఖర! జయ ధరాత్మభవేశ! యందు వేల్పులు సన్నుతించుమ్రోఁత
తంత్రులు సారించి తపసి వీణియమీటఁ బరఁగుగీతీపరంపరలమ్రోఁత
తే. మద్దెలలమ్రోఁత ఋషిపాఠ్యమాన వేద
మంత్రములమ్రోఁత లోకర్కటై మట్టుమీఱ
తనరు శ్రీరామలింగసంస్థాపనోత్స
వంబు సూచింప నొకయింతడంబు మాని. 89

చ. ధరణికి డిగ్గి రామవసుధాపతికిన్ నతి చేసి జానకీ
తరుణికిమ్రొక్కి లక్ష్మణుపదంబుల కానతుఁడై సమస్తవా
నరుల యథోచితస్థితి మనఃప్రమదాంబుధి ముంచి సైకత
స్థిరశివలింగపూజనము సేయురఘూద్వహుఁ గాంచి ఖిన్నుఁడై. 90

క. కంపింపఁ జెవవితో నెవ, కెంపుంజిగివన్ను కన్నుఁగ్రేవల నీటం
జెంపలు దడియఁగ శోకప,రంపర నప్పవనసుతుఁడు రామునిఁ బల్కెన్. 91

క. కనవలవదు ననుఁబోలిన, తనుజాతుని నెప్పటికిని దల్లి! నిజం బో
జననాథ! వృథాస్థూలము, తనువుండిన నేమి లేక తలఁగిన నేమి? 92

ఉ. అందఱముందఱన్ ననుఁ బ్రియంబునఁ బిల్చి "సమీరపుత్ర! నీ
కెందు నసాధ్యముల్ గలుగ విప్పుడె తప్పక వెండికొండ నెం
చం దగులింగముం గొని వెసం జనుదె"మ్మని తెచ్చునంతలో
దండడిచేసి వాసి సికతామయలింగము నిల్పఁ జెల్లునే? 93

క. నే నెంత నాదుబల మనఁ,గా నెంత యనంతశక్తికలితుఁడ వగుస
కేనా? యుద్యోగంబులు, పూని ఘటింపం దయాప్రపూరితహృదయా! 94

క. పరితాపానలకీలల, భరియించి వసించుకంటెఁ బ్రాణంబులు వే
గిర మేఁ బెడఁబాసి మఱి నీ,చరణంబులు గనుట మిగులసౌఖ్యం బనుచున్. 95

భుజంగప్రయాతము.—
వగం బుట్టుబాష్పాంబువర్షంబుతోడన్
బెగం బిట్టు చింతించుతీవ్రంబు గూడన్

సెగం బెట్టునిట్టూర్పుచే మోము వాడన్
దగం దొట్టునజెట్టి దర్శించి క్రీడన్. 96

క. కరుణ జిగి చూపుచూపులు, చిఱునగవు ప్రసన్నముఖము చిన్నిపలుకులున్
మరులుకొనఁజేయుసోయగ, మరుదుగ నను రామదేవుఁ డనిలజుతోడన్. 97

ఉ. ఇంతవిచార మయ్యెఁగద! యేమను? వనుభేనయుక్తి నీ
స్వాంతమునందు వర్తిలుట నన్యుఁడ నే ననుచింత యొంతప
ర్యంతము జంతుసంతతిహృదంతమునందు వసించు నంతప
ర్యంతము జన్మమృత్యువుల కంతము లేదు సమీరనందనా!

ఉ. ఊరక శోకమందెద వయో! వినయోన్నత! సన్నుతుల్ తిర
స్కారము లాత్మరీతిఁ గన సర్వము దేహగతంబు లెవ్వియుం
జేరక చిత్స్వరూప గతిఁ జెల్వగునీకు శరీరమం దహం
కారము దూర మైన నధికారము గల్గెడుఁ దత్త్వసిద్ధికిన్.

క. నిత్యానిత్యవివేకము, ప్రత్యేకము దేహ మనెడుభావము నంత
స్థిత్యచలత్వము గల్గిన, సత్యాశయుఁ డొందు ముక్తిసంపద ననఘా!

చ. జననము నొందుజంతువులు నాజననం బయి యున్నజంతువుల్
తనువులు వీడు జంతువు లుదారగుణాకర! లెక్కలేవు సం
జననము నొందునప్పుడయ చచ్చుట తప్పదు చచ్చినప్పుడే
జననము దప్ప దేటికి విచారము? నిత్యమె దేహ మేరికిన్?

చ. కలిగినయట్టె యున్నవి జగంబులు స్త్రీధనజాతసౌఖ్యముల్
దలఁగనియట్టె యున్నవి నతం బయి దేహము కాలసంగతిన్
నలఁగనియట్టె యున్నది జనంబుమనంబున కింత మాయ వె
గ్గల మని యుగ్గడింపఁ గలకారుణికుండు గురుండు గల్గమిన్.

చ. చనియెడువేళ భోజనము సల్పెడువేళ శయించువేళ లే
చినయెడఁ గామినీరతి వసించినవేళఁ గృతాంతుఁ డీవిగ
జ్జనముల వెంబడిన్ విడువఁజాలక ద్రిమ్మరుచున్కి నిచ్చలోఁ
గనుఁగొనలేక లోకు లధికస్పృహ మాన రదేమొ! మేనిపై.

క. ఈదేహమునకు నీకును, లేదనుబంధ మన దేహలీలావిభవా
పాదిత మగునొకవస్తువు, నీది యగునె? యేల భ్రమ? మనీషివరేణ్యా!

తే. కర్మవశమున సుఖము దుఃఖము జనించు, నదియె బీజంబు వివిధదేహాంకురః
కంగసంగతి పెచ్చుగాం దగుటఁ దొలుత, దేహి దేహవిభేదంబు తెలియవలయు.

క. పరవస్తువు నావస్తువు, నరి మిత్రుం డ నెడువికృతి యంతయు నంతః
కరణవశంబునఁగా యని, పరికించితివేని భేదభావము వాయుఁన్. 106

క. ఏను నా యది యనునభి,మానంబునఁగాదె జననమరణము లగుటన్!
మానసమున దేహాద్యభి,మానము లేకున్నచోఁ బ్రమాదము గలదే? 107

క. తను వభిమానించినయది, మన మగుటన్ బుద్ధివలన మఱి పోఁచిన వె
ల్లను మిథ్యగా నెఱింగిన, ననఘా! దేహాభిమాన మంత నడంగున్. 108

క. ఒడ లన్న మస్థిరం బని, యెడమలి తెలిసికొని దీన సౌఖ్యము మఱభం
బెడ చేసి శత్రువుంబలె, విడువుమిఁకం దదభిమానవిభవము వత్సా! 109

తే. నిజము చెప్పెద విను ఓకు నిజ్జలంగము, ప్రకృతివశమునఁ గలిగినభాతిఁ దోఁచుఁ
గలిగినది కాదు జ్ఞానియె కాని దాని, కప్పటం బని యెఱుంగు గానలేఁడు. 110

సీ. ప్రత్యక్ష మైనప్రపంచ మేలాగున సత్యంబు గాదని సందియించి
కలిగినవిశ్వంబె కాదన్నఁ గనరానియాత్మ నిశ్చయ మెట్టు? లని దలంచి
కర్మాతిశయమునఁ గాదె? బ్రహ్మాదులు ఘనులౌట లని కర్మగతి నుతించి
పరమాత్మకును జీవభావంబునకు భేద మై యుండు నైక్య మె ట్లని చలించి
తే. విపులవిపరీతసంశయావేశు లగుచు, నజ్ఞు లై స్త్రీధనాసక్తి నన్య మెఱుఁగఁ
జాలక తుయుక్తి గురుభక్తి సలుపలేక, మూఢులు సంసారమునఁ జిక్కి చెడుదు రనఘ!

క. అంతఃకరణవశంబున, జంతువులకుఁ జావుపుట్టు సంగత మైన
ట్లెంతయును దోఁచుఁ జూచిన, భ్రాంతియకా కందు లేవు భవమరణంబుల్. 112

తే. పవననందన! సకలప్రపంచమునకు, నశ్వరత్వంబు సిద్ధంబు శాశ్వతంబు
బ్రహ్మ మిందున సందియపడఁగ నేల? మనన మొనరించి తెలియుమీ మానసమున. 113

ఆ. పంచభూతములకుఁ బరియింద్రియములకు, విషయములకుఁ జిత్తవృత్తులకును
దెలియఁబడక తాన తెలివియై యున్నంటిఁ, దెలియుచున్న తెలివిఁ దెలిసికొనుము.

జ్ఞాతృజ్ఞానజ్ఞేయము, లేతాదృశబుద్ధి నిడక నేకాకృతి నీ
చైతన్యంబునఁ గనఁబడు, చైతన్యమె చూడు కలుగు సౌఖ్యము లెల్లన్. 115

తనువు కడఁ ద్రోసి మది నొండుతలఁపుఁ బాసి
కన్నుఁగవమూపు చంద్రభాస్కరులమండ
లాగ్రములు నుంచి లింగత్రయప్రముక్త
సచ్చిదానందరూపంబు సరగఁ గనుము. 116

తత్త్వము లైదు వాటిలఁగదాఁ దను వయ్యెఁ దదీయమోహసం
గత్వమునంగదా భవము గల్గె నటంచు వివేకి వై భజ

స్తత్త్వప్రమోహనేతరవిశాలమతిం దిలకించి చూడు మా
తత్త్వమసీతివాక్యభరితస్ఫురితార్థము వాయునందనా! 117

క. ప్రీతిని హృదయాకాశము, భూతాకాశంబుఁ గలయ బొందించినచో
నాతఁడె గతలక్ష్యం బగు, చైతన్యాకాశ మొదవు సౌజన్యనిధీ! 118

క. పొడవుగఁ బెరుఁగుట లెల్లను, బడుటకొఱకె కూడు టెల్లఁ బాయుటకొఱకే
పుడమిం బొడముట లెల్లను,గడపట లయమందుకొఱకెగా! కపిముఖ్యా! 119

తే. కాన నీలోన దేహాభిమాన ముడిగి, యద్వయజ్ఞాననిష్ఠ నహర్నిశంబు
నాత్మ చింతయె ఘటియింపు మందువలన, మొనయ నేరవు భవరోగములు కపీంద్ర!

క. మత్కృతము త్వత్కృతం బగుఁ,దత్కృత మగు మత్కృతంబు ద్వైతమువలదో
సత్కృతి లింగస్థాపన, సత్కృతి నీవాచరించుసత్కృతిగాదే? 121

ఉ. లగ్నము చారు వౌట జటిలప్రవరుల్ వివరింప భూసుతో
ద్విగ్నమృగాక్షి చేసి యొనరించినసైకతలింగముఁ బ్రియా
మగ్నత నిల్పి పూజన లమర్చితి మిచ్చట నింతమాత్రకై
భుగ్నతఁ జెంద నేల కపిపుంగవ! నాపలు కాదరింపుమా. 122

ఉ. ధీరవరేణ్య! నీ విపుడు దెచ్చినలింగము నేఁడె నిల్పు నీ
పేర జగంబులన్ వెలయఁ బెంపుగ నెల్లజనంబు లింక నీ
పేరిటిలింగమున్ మొదటఁ బేర్కొని పూజ లొనర్చి యంత
నా పేరిటిలింగముం గని యభీష్టగతిన్ భజియింతు రెప్పుడున్. 123

ఉ. ఈవును బ్రహ్మరాక్షసుల నెందఱనేని వధించి తాఁజలోఁ
గావున నీదుపేరఁ గుతుకంబున శంభుఁ బ్రతిష్ఠ చేసినన్
బోవు నఘంబు లెల్ల దయఁ బూని మహేశుఁ డొసంగినట్టియీ
దేవుని వామదేవుని ధృతిం దిలకించినవారె యుత్తముల్. 124

వ. అని మఱియు నిట్లనియె. 125

మ. సికతాలింగము దీసి లింగముఁ బ్రతిష్ఠింపం దలంతేని దు
శ్శకమాకార్య మదెట్టు లన్నఁ దిలకించన్ సప్తపాతాళభూ
మికలం బాదుకొనెన్ మహేశుఁ డిఁకఁ జేర్మిన్ దియ్యనే శౌర్యతా
ధికశక్యం బటు గాక దీసినఁ బ్రతిష్ఠింతున్ భవల్లింగమున్. 126

చ. అనవుడు నెమ్మొగంబుఁ దెలియం జఱునవ్వున గంధవాహనం
దనుఁడు రఘూద్వహాంఘ్రులను దండము వెట్టియు దెంత కార్యమో

దినకరతేజ! దేవప్రతిష్ఠ గదా యని కొంకినాఁడఁ గా
కనిమిషశైలమైన ద్రుహిణాండము దాఁటఁగ మీటఁ జేరనే? 127

సీ. అని విజృంభించెఁ బావని నా శతానందుఁ డావసిష్ఠునిఁ జూచి యచ్చెరుపడి
పరతత్త్వమార్గంబు పతికెల్ల నిరియును దత్ప్రతిష్ఠితశివోత్పాటనంబు
పరుల కసాధ్యమం చెఱిఁగియు స్వామిభృత్యన్యాయసరణి దానధికుఁ డయ్యెఁ
దన కసాధ్యం బైన దాశరథీశ్వరోత్పాటనోద్ధతి కేల పాలుపడియె?

ఆ. నెఱుఁగ కిట్టిచేఁత మొనసెనో యెఱిఁగియుఁ, జేయవలసి చేసెనో యథార్థ
వచనరచనఁ దెలుపవలయు నావుఁడు లెస్స, యడిగి తని వసిష్ఠుఁ డతని కనియె.

సీ. శ్రీరామలింగంబు సికతామయంబుగాఁ జింతించులోకులభ్రాంతిఁ బాపఁ
బవరి సాంబద్రోహ మొనరించి ఘనుఁ డైన నెఱి దూలువనుమాట నిర్వహింప
సకలాదిలోకముల్ వ్యాపించె శివ్వఁ డన్న రామువాక్యము నిదర్శనము సేయ
నణురేణు వైన రామావనీశుఁడు నిల్ప నొరుల కసాధ్యమా తెలుకపఱపఁ

ఆ. దలఁచి రామనాథదైవతోత్పాటనో, ద్ధతి వహించెఁ గాక ధర్మవేది
పరమపుణ్యుఁ డతఁడు ప్రత్యక్షపరమేశుఁ, డజ్ఞుఁ డే చెలంగ నవల వినుము. 129

వ. ఇవ్విధంబున దశకంధరపరిపంథివచస్సంధిబుద్ధి ననుసరింపక గంధవాహనందనుండు పుండరీకంబునకు శుండాదండంబు నిగిడించుమదవేదండప్రకాండంబు మెండున నాఖండలాదిదివిషన్మండలఖండనసముద్దండదందశూకాఖండప్రతాపప్రచండదైతేయమండలేశ్వరమదాంధకారమార్తాండకరప్రకాండభీకరతరకరప్రకాండంబు సారించి నిజాటోపవిలోకనజాయమానభయవేపమానగౌరీమానవతీ మానగ్రహకల్పితదృఢాలింగం బగురామనాథలింగంబు ననాయాసంబున నెమల్చి యగలకున్న విసులువడక కలకల నగుచుఁ గిలకిలార్భటి సముద్ఘటించి మోఁకారించి వాలం బెగవట్టి కరద్వయంబునం బట్టి దిట్టతనంబున నిట్టట్టుగా నూఁగియుఁ బట్టుకన్న గట్టిదై నెట్టుకొన్న యట్టి లింగంబు నెడ నుట్టిపడు కట్టల్కన్ సహంకారంబున హుంకరించుచుఁ దటదట కటకటంబు లదరఁ జటులశరలోచనంబులఁ జిటచిట నిప్పుకలు చెదర గిటగిట పండ్లుగీటుచు బటపట బ్రహ్మాండభాండంబు వగుల నట్టహాసంబు చేసి యిట్టియీశ్వరాపరాధంబున నేమి పుట్టునో యని పుడమిపట్టి బిట్టడల నింతయహంకృతి దగునే యని లక్ష్మణుండు నొగులఁ గపిబలవంతున కింత యసాధ్యం బగుట వింత యని రమాకాంతుండు చలింప రామప్రయుక్తతృణంబు ద్రుహిణాస్త్రం బగు టెఱింగియుఁ దత్ప్రతిష్ఠితలింగంబు భంగంబు నొందింపఁ దలంచుట వివేకంబు గా దని విభీషణుం డాదినాథాఢ్య నంగద కుముద నల నీల పనస జాంబవదాదివనచరనాథు

కులు నమకుఁ దోఁచిన తెఱంగునఁ బలుభంగులం బలుక రఘుకులాధ్యక్షునికటాక్షం బున జగత్ప్రాణసూనుని ప్రాణంబులకు హాని లేకుండెడు మని మహర్షు లాశీర్వదింప నభోభాగంబున బారులు దీఱి నగవిదారిప్రముఖబర్హిర్ముఖ గరుడ గంధర్వ కిన్నర కింపురుష యక్ష రాక్షస సిద్ధ సాధ్యాదివియచ్చరులు మెచ్చుకంటులతో నిచ్చ నచ్చెరువడి చూడ సప్తమారుతంబులు నిజానుకూలంబుగా వాలంబునకు బలంబు గూర్ప సాటి యేర్పఱుపరానియున్నిద్రరౌద్రంబునఁ బ్రళయకాలరుద్రుని కకాల రుద్రుం డై దిక్కూలముద్రుజసముల్లోలకల్లోలంబు లై సప్తసాగరంబులు గలంగ నభంగభయభంగురంబు లై సప్తద్వీపజనంబు లదలంగ సప్తాశ్వప్రముఖగ్రహ నివహంబులు త్రోవలు దొలంగ సప్తకులపర్వతంబులతో ధరాతల మల్లాఁతల్లాఁగ మహాభూతంబు లాక్రోశింప దిక్కరులు ఘీంకరింప భూమిభరంబు భరింపలేక వ్యాకులపడు కాకోదరలోకనాయకునిఁ బట్ట నట్టిట్టుగుజరకమఠపరివృఢుం డానుటకై మట్టి బిగఁబట్టి యాదిమకిటిపట్టభద్రుండు గట్టిగాఁ బీఁటపెట్టు నొట్టియుత్పాతంబు పుట్టె నని పట్టుపుట్టంపుఁబట్టంపు వేల్పుపట్టికి బెట్టిదపుఁజింత దొట్టికొన్నఁ బాశాంకుశ త్రిశూల డమరు ఢక్కా టంక ఖట్వాంగాదిసాధనంబులు గైకొని క్షత్రజంచుకుమారప్రముఖప్రముఖులు వారణాననివారణోక్తులు సైరించి కాచి యుండ నానతాంగంబున సమంబులుగఁ గరచరణంబు లిలాతలంబునం బెట్టి సింధుబంధనసమయసముత్పాటితమంధరధరాధరబంధురరేఖాధురంధరవసుంధరాధరజాలంబగువాలంబున లింగమూల మామూలంబుగాఁ జుట్టి పట్టి చలపట్టి కరువలిపట్టి యప్పట్టించుకయుఁ దప్పించి యుప్పరంబునం బెట్టొదనని చట్టుపలుగనుపట్టి మిట్టిపడుగట్టుజేలిగుట్టు మట్టుపెట్టుగట్టిశనంబున బిట్టాగసి లింగంబు వీఁక తనతోఁక వెంట నంటిరాక నిరాకరించుటం జేసి యాకసంబున సేకరింపలేక సకలలోకపాలక హాహాకారంబులతో నవరంధ్రంబుల బుడబుడ నెత్తురులు వడియ వడి యడఁగి యక్కడికి రెండుగడియలయెడ నొడ లెఱుఁగక పరవశుం డై పుడమిం బడియె నప్పుడు. 130

క. పవమానతనూజన్ముని, నవరంధ్రములందుఁ దొఁగునవరక్తము చే
నవలోకసురవధూదృక్కువలయవలయ మన రక్తకుండము వెలసెన్. 131

సీ. గమనవేగంబున ఘనజటాబంధంబు గళితమై యంసభాగమున గునియఁ
గేలఁ గుచ్చెలకొంగు గీలించి దగ మించ నసురుసురై సీత యరుగఁ దేర
భుజముల వెడజాఱుభుజపత్రవల్కలాంచలము చేఁ బూని లక్ష్మణుఁడు నడవఁ
గైదండ యొసఁగుటకై వండసాఁచినశయ్యముతోడనె విభీషణుఁడు ర్రాఁగ

తే. నేరిపైఁ జింత లేక హాహారవంబు, తోడఁ గన్నీటిమున్నీటఁ గ్రోవ దడియఁ
దడయ కప్పుడు దశరథాత్మజుఁడు వచ్చెఁ, బవనతనయుం గాంచి మూర్ఛిల్లి పడినయెడను.
ఉ. అప్పుడు ధూళిధూసరితుఁడై కనువమ్ములు మోడ్చి మక్షికల్
గప్పుకొనంగ నెత్తురులు గ్రక్కెడునక్కపిముఖ్యుఁ జేరి మా
యప్ప! యిదేమిరా? యని ధరాత్మజ కన్నుల బాష్పపూరముల్
చిప్పిలఁ గేలువట్టిఁ దుడిచెన్ తనుసక్తధరాపరాగమున్. 133
తే. అచట వసియించి తొడమీఁద ననిలసుతుని, శిరము నిలిపి నెత్తుటిచేతఁ దడిసి
పుల్లసిలు మోము గనుఁగొని తల్లడించి, ప్రేమ సీతాధిపతి విలపింపఁదొడఁగె. 134
దాయలశూల ముద్గర గదా పరశు క్షురికాదిహేతులం
గాయము గాయముం గనని కాయ మహాయముఁ జెంది కందెనే
మోయి? మదీయసూక్తి వినవోయి! యి దేటికి మాటలాడ వా
హా! యసహాయశూరవిజయైకవిహార! సమీరనందనా! 135
మాతయుఁ దాతయు మీరని చేతులు మొగిడించి సేవ సేయుదువుగదా!
నాతండ్రి! మున్ను నాకును, సీతకు నిపు డేల? భక్తి సేయవు చెప్పుమా! 136
కన్న తల్లిఁ దండ్రి నున్నసోదరులను, చిన్ననాఁటనుండి చెలిమి నిండి
మన్నవారి నెల్ల మఱచియుంటిఁగదోయి, గాఢ్మపట్టి నీవు కలుగఁబట్టి. 137
క్షోణికుమారికామణి నశోకవనిం గని సంతసించి త
త్ప్రాణము నిర్వహించి వనపాలకులన్ వివశించి రావణా
రీణచమూవరేణ్యుల హరించి చరించుట లెంచ కక్కటా!
స్థాణువుచంద మొంది వివశత్వముఁ జెందుదురయ్యె? పావనీ! 138
హాటకగర్భబాణము నిశాటకుమారుఁడు నాటనేయఁ బో
రాటము వాయఁ బట్టువడి యట్టిటు మిట్టిపడంగ రావణున్
నోటికి వచ్చి నట్టని యనూనభుజాగతి నిటుమేటికిన్
బాటిలె నేటికిన్ వివశభావము దైవమ! యేమి సేయుదున్? 139
క. నేమంబున నీవున్నను మామూర్ఛ లడంచి ప్రాణి మరలింతు వయో
నే నెందఱ మున్నను నిను, నేమంబున మూర్ఛ దెలుప నేరమ తండ్రీ! 140
తే. అకట! కనుసన్న చేసినయంతమాత్ర, నాత్రమున నేఁగి సంజీవనౌషధంబుఁ
దెచ్చి యిచ్చిననినువంటిధీరమణికి, జీవ మెడఁబాయనాయె సంజీవరాయ! 141
ఆ. జగతి యేల నేల సౌమిత్రి యేల సీ, తాలతాంగి యేల తక్కియున్న
వార లేల నిన్నువంటిగుణాఢ్యుండు, లేకయున్న నాకు నోకుమార! 142

క. అని పలురీతుల మారుత, తనుజుని పవనాంబుజంబు దర్శించుచు రా
మనృపాలకచూడామణి, కనుఁగవ వెన్నీట నతని కాయము దడిపెన్. 143

ఆ. అంత మూర్ఛదేఱి యక్షరక్షోవైరి, చింత జాఱి రాజసింహుఁ జేరి
కొంత తన్ను దూఱికొని బత్తిఁ దగుదారి, వింతసూక్తి మీఱి వినుతి జేసె. 144

నిరోష్ఠ్యదండకము.—

శ్రీరాజితాకార! సాకారసాకేతరాచారసాక్షేత్ర రాజన్యసన్యస్తనానాక్రియా! ధన్య
సంకీర్తనా సక్తసక్తంచరాదైన్యజన్యాచలాగణ్య! ధైర్యాశ్రయావాస! నిశ్శ్రేయ
సాధార! సాధారణాన్యత్రయీకేళికాశాలినాళీకరాట్సంతతిక్షీరనీరాకరాధీశ రా
కానిశాకాంతశాస్త్రైకరాద్ధాంతగాధేయ యాగాంతరాయక్రియా కారణాదిత్య
రాజారినిర్ధారణా! చారణశ్రీహృతాంచజ్జటాధారినారీశిలాకార! శ్రీకంఠకాండా
సనాహీంద్రనాగాంతకా శాంతకాంతాంతరంగాధరాకన్యకారీణ కల్యాణకల్యా
సకల్యాణ! కల్యాణధాత్రీధరస్థైర్య! రక్షశ్ఛటాహస్తిహర్యక్ష! క్షత్రక్షయాక్షయ్య
శక్తిస్థిరజ్యాజిరేశానసంఘర్షణాశాలితాక్రాంత సత్కీర్తిసంఛన్నదిగ్దేశకర్ణాంత
దృగ్దీర్ఘతానందితానందనాత్యచ్ఛనీరేజతేజఃకళానిర్జితానంగరత్నాంగదా! రంగదా
కాశగంగాతరంగచ్ఛటాసంగజంఘాలనిర్హ్రాదఖేదా! నతాస్యైకదృశ్యద్దశస్యంద
నాజ్ఞాదృతారణ్య! తారాకళత్రాననశ్రీచకాసత్కళత్రాశ్రితాశ్లేషణానంద! నానా
జటీశాగ్రణీజాగ్రదర్చాలసచ్చిత్త! సత్యాశయాయత్తసారంగ! దైతేయశిక్షాకళా
దక్ష! సత్క్షాంత! సాక్షాచ్చిదాకాశసంకాశహేతీ! కిరాతీకృతానేకసత్కార!
సత్కారదైరాదృతాదిత్యసంజాత! శాతాస్త్రసంధాత! లేఖాధిరాణ్ణందనాకంధి
సంత్రాసనస్నాహధిన్నాదితేయారి! యేరీతి నీరీతి నీరేజజాతాదిధీరాగ్రణీజాతికిం
జింత సేయంగఁ జిచ్ఛక్తి రంజిల్లెడిన్ జెల్లరే హల్లకాస్త్రారిదారిన్ గ్రసింపన్
హృషీకేశతాసక్తి రక్షింపఁగం జాసనాఖ్యం జగజ్జాతసృష్టిన్ ఘటింపన్ నటింపన్
ద్రిలోకాధినాథాకృతిన్ జెంది నీశక్తి నిత్యస్థితిం గాంచఁగారాని హేలాగతిన్
రాజలీలన్ రజఃకేళి లాలింపఁగా నెంతయాసక్తి యయ్యారె యయ్యాసతీసంగతిన్
రాగలీలాదృతిన్ గన్నచందాన నందంద క్రీడింపడెందానసీక్రీడ ధ్యానించి యజ్ఞా
శిరాజన్యతాజ్ఞాతృచాంచల్యసంగాంతరంగస్థితిన్ జిక్కితర్కించిహీనక్రియంగాంచి
కించిజ్జ్ఞధీలీల నీహేల శ్రీలాకుటీసక్తిగా నిర్జరాధ్యక్షరక్షావనారక్తిగా నెంచి యిష్టార్థ
సిద్ధిం గనం జాల నజ్ఞానరింఛోళినీహాళికం జాతజాతాండకాండక్రియాశాలిగాఁ
గాంచి నీచిత్కళాకారరేఖాగతిన్ జ్ఞానదృష్టి న్నిరీక్షించి చిత్తేంద్రియాదిక్రియా

గాత్మచైతన్యరేఖన్ నిరాఘాటతన్ జేసి రాజిల్లె శ్రీజానకీకాంత నీచెంతనత్యంత
కాంతాకృతిన్ నిల్చి కల్గింపఁగాఁ గంటి నేతాదృగంగాఖ్యలీలాతదన్యస్థితిన్ గన్న
నీచేతనే ఖ్యాతి రాజిల్లెడిన్ ందరాత్రించరచ్ఛేదనక్రీడఁ గ్రీడింపఁ దండ్రీ!
జగత్కారణక్రీడ లిచ్ఛాగతిం జెంది యాద్యంతహీనాకృతిన్ గన్నచో నీ గలాఁడే
యిలాకన్య త్తకాసారసంచారి! చంచద్దయావృష్టి చి నాజాతిచేష్టాని
కృష్టేహ వృష్టింప కిష్టావృతిం జేర్చి రక్షింపఁగా నీకె కా కేరికిం జెల్లునే? హరి
కల్యాణసంధాయకా! దైత్యహృత్సాయకా! జానకీనాయకా! 145

మ. అని వినుతించి రామవసుధాధిపుచెంత వసించి మూర్ఛిలం
గను గనుదోయిబాష్పములె కౌతుకబాష్పము లైనమాతకున్
జనకకుమారికామణికిఁ జాఁగిలి మ్రొక్కి కరద్వయంబు చ
క్కఁ నుదుటఁ జేర్చి యి ట్లనియె గౌరవచారువచోవిజృంభణన్. 146

మత్తేభకందగర్భితసీసము.—

విగతకామాత్ములు విశ్వమాతవుగదా కల్యాణియం చెన్నఁగాఁ దనర్చి
విహితతత్త్వస్థితి విద్యవై త్రిగుణతాహేలాకృతిం జెంది యీక్రమమున
నతతసౌశీల్యవిశాలతల్ వెలయఁగా వర్తించి ధన్యుల్ సదా ముదమున
నిశితబుద్ధ్యున్నతి నిన్నె కొల్తురుగదా సీతా జగత్కారిణీ! తిరముగ

ఆ. ననుచు వివిధగతుల ననిలతనయుఁడు పొ,గడిన వినుచుచు దనుకరుణ ననెను
జనకనృపతితిలకతనయ ఘనతరల, సమ్మృదరససుఖదవిదితగతిని. 147

మ. సకలసజ్ఞానకళాకలాపుఁ డినవంశస్వామి లోకావనో
త్సుకుఁడై శాశ్వతభక్తియుక్తి నవు నీచోటన్ బ్రతిష్ఠించినన్
సికతామాత్రునిగాఁ దలంపఁదగునే నేఁడాదిగా నిట్టిగా
యకముల్ సేయకుమన్న! స్వామిహితకార్యాసన్నతం బుత్రకా! 148

తే. తప్పు చేసితిఁ బతి కని తల్లడిలకు, నీమనశ్శుద్ధి యెఱుఁగు శ్రీరామవిభుఁడు
పాపఁ డాటల కెనసినపనులు చూడఁ, దండ్రికానందములు గాక తప్పు లగునె?

క. స్వామి నిజమర్మ మంతయు, నీమీఁదియనుగ్రహమున నీ కెఱిఁగించెన్
బ్రేమమున దాఁచ కిప్పుడె, నామర్మము దెలిపెదను సనాతనఫణితిన్. 150

క. రామస్వామిపరాత్పరుఁ, డేమూలప్రకృతిఁ గార్యహేతుత్వములన్
మే మిరువుర మై చెలఁగుదు, మామీఁదటియొకరహస్య మధిపుఁడె యెఱుఁగున్.

శా. తత్సాన్నిధ్యవిశేష మేఁ గని మహత్తత్త్వాదితత్త్వైకసం
పత్సామగ్రి వహించి తద్విషయరూపవ్యాపకం బైనయే

తత్సర్వంబు సృజింతుఁ బెంతు నడఁతుక్ ద్రైగుణ్యవిస్ఫూర్తిచే
వత్సా! మన్మహిమంబె సుమ్ము మతిదృగ్వ్యాపారదృశ్యాకృతుల్. 152
మ. త్రిపుటీశూన్యన కీజగజ్జననశక్తిస్ఫూర్తి వర్తిల్లఁగాఁ
గపిలోకేశ్వర! సత్త్వసంకలితసంకల్పాకృతిక్ మించి భే
దపుభావంబు వహించి యుండియు నభేదవ్యాప్తి వర్తింతు నీ
యపురూపంపురహస్య మీ వెఱిఁగి నిత్యానందముం బొందుమా. 153
తే. తావకీనాంగకీలాలధార జాఱ, వఱలుకుండంబు నీపేర వన్నె మీఱ
ఘోరదురితాపహారప్రకార మగుచు, నిది మొదలుగాఁ బ్రసిద్ధి వహింపఁగలదు. 154
సీ. పొడగన్న వడ కెన్నఁ డిడకున్నఁ గడచన్నయెడ మన్ననల నిల్పు నీతటాక
మరుదెంచు బిరుదెంచువరుమించు తెరనొంచి పెరిగించు గురుఁ జేర్చు నీతటాక
మనువారఁ దనుఁ జేర నెన రూరఁ దనివార నినపారరుచి సేయు నీతటాక
ముచు మానమున మాన కనుతానమున పూన నెనలేని సిరులీను నీతటాక
తే. మిది జగజ్జనజీవనం బిది సుధైక, జీవనం బిది లోకైక పావనంబు
ఇది తపోధనపరితోష మిది విశేష, మీసరంబు సరంబులమీసరంబు. 155
తే. జనులయెమ్ములు నీసరోజలములందు, నెంతకాలంబు వసియించు నంతకాల
మంతకాలయ మొందక చింతమాలి, దివ్యగతి నుందు రమరసదృశు లగుచు. 156
తే. హేళిలీల తమఃపాళి హాళి మాలి, వ్రాలులీల సదాలోకలోలలోక
జాలభవహాలహాలహారి! శూలపాణి, త్వత్సరోమణి మునుఁగ దుర్దశ లడంగు. 157
సీ. భవజటాజూటసంభవ యైనగౌతమీనదిలోనఁ దాన మొనర్చుసుకృతి
కశ్వమేధసహస్రశాశ్వతఫల మబ్బు నబ్బుర మబ్బింప నంతకంటె
శతగుణాధికపుణ్యసంపద నింపుగంగాపతంగకుమారికాతరంగ
సంగతి గలసరస్వతిలో మునింగిన నానదీస్నానోపమానఫలము
• చేరుఁ దావకకుండాభిషేకమహిమ, నహిమహేశ్వరునంతవాఁ డైన దీని
నెఱిఁగియిదమిత్థ మని నుతియింపఁగలఁడె, నిజము చెప్పెద విను మింక నిష్కళంక!
హనుమత్కుండంబున నే, జనుఁ డేని తిలోదకము లొసఁగు ముదమున నా
తనిపితరులు ఘృతకుల్యం, దనరుదు రని సపతియై జనకసుత పలుకన్. 159
సీతారాములపలుకుల, చేతఁ గలఁకదేఱి యచట శివలింగము సం
ప్రీతి మెయి నిలిపె మారుతి, భూతలజను లెల్ల మొదటఁ బూజ లొసంగన్. 160
ఇత్తెఱంగున లోకోత్తరుం డైనమరుత్తనయుండు సీతామత్తకాశినీచిత్తేశచిత్తహర
లింగంబునకు నుత్తరంబున నిజాయత్తలింగంబు నభంగసిద్ధం బ్రతిష్ఠించెనట

న్నతనిలాంగూలవేష్టనంబున రామలింగంబు వళిత్రయకలితాంగంబై యిప్పటికి జగజ్జనదర్శనంబులకు నిదర్శనం బయ్యె నని రామలింగప్రతిష్ఠాపనకథనంబు దురధిగమజనురంబుధినిర్మథనం బని వసిష్ఠమునిపురుహూతుండు విక్రమసూనుఁ గిట్లనియె.

ఉ. వాయుజుపై ధరాత్మజకు స్వామికిఁ గల్గినప్రేమ [illegible]
శ్రీ యిరవొందుటల్ తెలియఁజెప్పినయాకథ విన్న మేటి
శ్లాఘాపరుఁడై బాంధవాన్వయుఁడు చెలువొందె యంత
శ్రేయముఁ జెందు నా విని వసిష్ఠతపస్వికి శ్రోత్రం

ఉ. హృత్పరితాప మార్చి కృప నీగతి మాయలఁ బ్ర [illegible] యభూ
భృత్పరమేశుఁ డెందు వసియించె? విశేషము లెవ్వి? శ్రీహనూ
మత్పరసత్కథామృతము మాటికిఁ గ్రోలెదఁ జెల్పవే యనన్
దత్పరతం దథావిధకథావిదుఁ డమ్మునివర్యుఁ డి ట్లనున్.

ఉ. రాజకులైకభూషణుఁడు రాముఁడు పుష్పక మెక్కి జానకీ
రాజముఖీసమేతుఁ డయి రమ్యమతిన్ నిజరాజధానికిన్
దేజ మెలర్పఁ బోవుచును దివ్యులపువ్వులసోనతో భర
ద్వాజులయాశ్రమం బెనసి వాయుకుమారునిఁ జూచి యి ట్లనున్.

చ. పరహృదయజ్ఞతాగరిమఁ బ్రాభవచారచనాచమత్క్రియన్
సరసుఁడ వౌట మాభరతుసన్నిధి కేఁగి మదాగమంబు మ
చ్చరితముఁ జెల్పి రమ్మనుచు స్వామి ప్రియంబునఁ బంపె మారుతిం
దిరువడికంటె నాప్తుఁ డవనీపతి కెవ్వఁడు భక్తిశక్తులన్.

ఉ. పంచిన మంచిదం చరిగి పావని మానవరీతి నాతనిం
గాంచి తదంచితార్చనలు గైకొని రామకథామృతంబు వ
ర్షించె హరించె శోకశిఖిజీవన మిచ్చె తటంచు నెంచి హ
ర్షించె ఘనప్రభావులకుఁ జిత్రమె యుల్లము చల్లసేయుటల్.

తే. హనుమ రాక వహిల్లినయాక్షణంబ
దరహసనచంద్రికలు గాయఁ దమము వాయఁ
దఱుచుగా హర్షబాష్పామృతంబు గురియఁ
బటుకళానిధి చెలువొందె భరతుఁ డపుడు.

మ. ఘనసేనావళి మేనఁ బూనికొని శాకద్వీపమర్ధక్షణం
బునఁ బ్రాపించినసత్వరంబు దనరం బోనిచ్చి రామాభిషే

కనిమిత్తం బయి యుత్తరాంబునిధి రంగన్నీరపూరంబుకాం
చనకుంభంబునఁ దెచ్చు టేమిటికి నాశ్చర్యంబుగా నెన్నఁగన్.

ఉ. మారుతిఁ గూర్చి స్వామి బహుమానము మిక్కిలి చేసి యున్నచో
నారఘురామునానతి మహామణిహారము పూని దీనమం
దార! కుమార! రమ్మనుచుఁ దానె యురంబున వైచి చూచె న
య్యారె! ధరాకుమారి కనిలాత్మజుపైఁగలకూర్మి యెట్టిదో!

ఉత్సాహ.—
ధారుణీకుమారికాప్రదత్తరత్నహార ము
క్తారి వక్షమందుఁ బూని యభ్రశుభ్రవాఃకణో
దారతారకావళీవృతస్ఫురత్సురాచలా
కారుఁ డై చెలంగె నన్న గౌతమాత్మజుం డనున్.

ఉ. అప్పుడు రామచంద్రుఁడు శతాననరాక్షసశిక్షఁ బూనుటల్
చెప్పర మైనమారుతికడిందిబలంబునఁ బూనె నంటిరే
యప్పని యెట్లు పూనెఁ బవనాత్మజుఁ డంత సవిస్తరంబుగాఁ
జెప్పఁగదే యనన్ ముని వచించు సమంచితవాక్చమత్క్రియన్.

ఉ. ఆహవభూమి రామవినుతాత్మశరోదితశోణితోద్భవో
త్సాహబృహచ్ఛతాననశతంబు హతంబుగ నేల మట్టుచున్
వాహన మై ద్విషజ్జయ మవారణ నిచ్చిన మెచ్చి మచ్చికన్
శ్రీహనుమంతుఁ గన్గొనెడుసీత జగత్త్రయమాతఁ గొల్చెదన్.

చ. క్షితిసుత మున్ను రాఘవునిచే హనుమత్కపి యేకపాదరు
ద్రతయుఁ దదంశ మూని యవతారముఁ జెందుట లాలకించె నం
చతని రఘూద్వహుండు గొనియాడిన చెల్లను దేటగాఁ వచిం
చితిఁ గద యంతమీఁదటివిశేష మశేషము విన్ము తెల్పెదన్.

శా. కాకుత్స్థాగ్రణి యట్టు లాత్మకథ వక్కాణింప భూపుత్రి య
త్యాకాంక్షన్ వినఁగాఁ బ్రపత్తిమెయి సాష్టాంగంబు సేవించినన్
మీ కారుణ్యమునం జెలంగుభటునిన్ మీ రింత వర్ణింతురే?
యో కారుణ్యచరిత్ర! శత్రుహృతి కుద్యోగింపరే నావుడున్.

సీ. పురరక్ష కనురూపబుద్ధిసంపన్ను మహామాత్యు నియమింప నవధరించి
యుఱవైనప్రజ నేలుపఱచి తోతెండని సేనాధిపతులకు సెల వొసంగి

కౌసల్యమొదలుగాఁ గలతల్లులకు మ్రొక్కి వారిచ్చుదీవనల్ వరుస నంది
తమయత్తలకు మ్రొక్కి తాను రాఁ బయన మాక్షితిసుతరాక కంగీకరించి
తే. మణిమకుటమూని హైమవర్మంబు దొడిగి
హారకేయూరకరకంకణాదిబిరుద
భూషణాలంకృతాంగుఁ డై భూమివిభుఁడు
వేగమున యుద్ధసన్నద్ధవేషుఁ డయ్యె. 175
సీ. తనవామహస్తంబు దక్షిణమృదుపాణి వహియించి సీత పార్శ్వమున నడవ
నాబద్ధతూణీరుఁ డై వెన్క సౌమిత్రి శరచాపములఁ బూని యనుగుదేరఁ
దొడి ప్రాసి కట్టి యప్పుడు వచ్చుప్రజఁ జూచి భరతశత్రుఘ్ను లెచ్చరికసేయ
నుభయభాగంబుల నొడ్డోలగంబుగా సబలు లక్కజవిభీషణులు గొలువ
తే. గజరథతురంగమపదాతికలితమనుజ, వనుజవనచరసైనికోత్కరముతోడ
హనుమ వలపలిమూఁపుపై హస్త మూని, యినకులస్వామి నగరోపవనముఁ జేరె. 176
తే. భరతభానుజపౌలస్త్యపతులఁ జూచి, మనబలము లెల్ల వచ్చెనే యనిన స్వామి
యన్నియును గూడె ననివారు విన్నవింప,హనుమకడఁ జూడనతఁడుసాష్టాంగ మెరఁగి.
క. చుక్కలు మొలప్రాసలుగా, దిక్కుల కవకాశమిడనిదివ్యాంగముతో
నెక్కడఁ జూచినఁ దా నై, యక్కపిశేఖరుఁ డజాండ మంతయు నిండెన్. 178
సీ. ఒక్కజంగకుఁ జాల వుల్లోలకల్లోలసంప్లుతాంబరసప్తసాగరంబు
లొక్కచెక్కికిఁ జాల వుగ్రభానుహిమాంశుమండలోద్యద్గ్రహమండలంబు
లొక్కఘట్టన కోర్వ వుర్వరాఖర్వధూర్వహవరాహిపరాహరాజముఖ్యు
లొక్కయుద్ధతి కాన దూర్ధ్వలోకానీకగర్భితబ్రహ్మాండకర్పరంబు
తే. శక్రవిద్వేషివిభవంబు నాక్రమింప, విక్రమించు త్రివిక్రమోపక్రమమున
నధికుఁ డమ్మేటి కమలగర్భాండపేటి, నిండి నిజమూర్తి విస్ఫూర్తి నిలిచె నపుడు.
సీ. మయి గదల్పఁడు గాక పయిచూర్ణమై రాలుతృణములో నూర్ధ్వలోకంబులెల్లఁ
జక్క నిక్కఁడుగాక వ్రక్కలై పడిపోవు గడి దక్కి యట మీఁదికర్పరంబు
పదము మెట్టఁడుగాక భగ్నన నడుగంటుఁ బై మోపుతోఁ గచ్ఛపప్రభుండు
బిగువు చూపఁడుగాక పెటిలి బీఁటలువాఱుఁ జక్రవాళముతో దిశావలయము
తే. అఖిలమస్సహరాక్షసాధ్యత్వశక్తి, కెనయుతను వావహించుట యింతె కాక
యట్టివిగ్రహమున నాగ్రహమును బూని, నిగ్రహించిన లోకముల్ నిజము గావె?
తే. మారుతి సమస్తలోకోపకారి గనుక, నొక్కదిక్కున ఘనమూర్తి నొందియున్న
నవని యెక్కడఁ గ్రుంగునో యతిభరమున,ననుచుఁ గకుబంతముల నెల్లనావరించె.

మ. తనదీర్ఘాత్తకఠోరవాలము బృహత్కాయంబు రక్తాననం
బును బద్ధాంజలియున్ రఘూద్వహపదాంభోజాతవిన్యస్తస
ద్వినయాలోకము దుర్నిరీక్ష్యతనుకాంతిస్ఫూర్తి పర్తిల్లఁగా
హనుమద్వానరవీరుఁ జక్కఁ గనలే రవ్వేళ బ్రహ్మాదులున్. 182

సీ. ఆపదుద్ధారకం బనుమనూత్తమముచే సద్భక్తుఁ డై విభీషణుఁడు పొగడె
మంత్రిగాఁదలఁచుదుర్మదుఁడనన్ క్షమియింపుమనిహస్తములు మోడ్చె నర్కసుతుఁడు
మాత్రివిక్రమమూర్తి మారటమూర్తియే యౌ నని ఋక్షేశుఁ డభినుతించె
నింతవాఁ డై గర్వ మింతయుఁ గనఁ డంచుఁ గాసత్త్వపతి శిరఃకంప మూనె
తే. ధరణిసుత కన్నుఁగవ మోడ్చె భరతుఁ డెంచె
నలరె సౌమిత్రి శత్రుఘ్నుఁ డరుదు నెందెఁ
గొదవవారల నేమి చెప్పుదు కపీంద్రుఁ
జక్కఁ గను విచ్చి చూడ నశక్తు లైరి. 183

సీ. ఆవేళ హనుమంతుఁ డాకాశ మంటినతనదీర్ఘదేహంబు ధరకు వంచి
పతి కెక్క నజ్జుగా నతి సేయునటు లున్నఁ దన్మహాకంధరాంతరమునందు
ధరణిజ నెక్కించి తానును మున్నెక్కి మెట్టి రాఁ దలఁకుతోఁ బుట్టువులను
నరసైనికుల వనేచరసైనికుల నిశాచరసైనికులఁ జూచి శంక యేల?
తే. హనుమ నారోహణము సేయుఁ డనిన వారు, నేల యీనినచందాననిండియున్న
తమతమబలంబుతోఁగూడి తరుచరేంద్రు, వీఁపుపై నెక్కి వినుతి గావించి రపుడు.

సీ. ఎవ్వానిబలుసేన లెత్తిరాఁగలవన్నఁ బల్లటిల్లుదు రిలాభారవహులు
లెక్కసేయఁగరాని దిక్కున నేరాజుమూఁక పేరుగణించు లోకవితతి
యేరాజువాహిను లెదురొడ్డి లవణాబ్ధి బెట్టిదం బడఁగించి కట్ట గట్టె
నేరాజుబలకోటి నీక్షించి జేజేలు చుక్క లెన్నికయైన సులభమండ్రు
తే. సాగరము వెల్లివిరిసినచంద మొందు, నేమహారాజుదళ మట్టిరాముసేన
యఖిలమును గూడి వీఁపుపై నధివసించె, ననిన సామీరిమహిమ యేమనఁగవచ్చు?

క. హనుమచ్ఛరమాంగాగ్రం, బున సీతాయుక్తి రామభూవరుఁడలరెన్
గనకధరాధరశిఖరం, బున నిలిచిన మెఱుఁగుతోడి మొగులు తెఱఁగునన్. 186

సందడి నెంది వందురక సందుల గొందులఁ జిక్కి తొక్కుడుల్
నెందక వెక్కసం బడరి చిందఱవందఱ గాక మూఁక లా
నందము నొందుచున్న రఘునాథునియాజ్ఞ శిరంబునన్ మరు
న్నందనుఁ డావహించి గగనంబున కుద్ధతి నుద్గమించినన్.

ద్వాపరయుగ ప్రసిద్ధులగు కురుపాండవుల ప్రాచీన శాసనవిధానమును, బలపరాక్రమసంపత్తిని, రాజ్య విస్తీర్ణతను, పశుధనసమృద్ధిని, దుర్నిరీక్ష్యమగు క్షాత్రతేజమును, అవక్ర శౌర్యబలపరాక్రమములను, చతురాశ్రమపోషణపారీణతను, స్వచ్ఛందజీవితానురాగమును, ఆర్తత్రాణపరాయణత్వమును గండ్లారఁజూచి యానందింపవలయునన్నఁ బంచమవేదమును శరణు జొచ్చుటకంటె నుపాయాంతర మేమి కలదు?

మొన్న మొన్నటి వీరసింహములగు మహారాష్ట్ర యోధుల నవీనసామ్రాజ్యనిర్మాణసామర్థ్యమును, అఖండదేశ భక్తిని, అప్రతిహత ధైర్యస్థైర్యములను, జాతీయధ్వజసంస్థాపనోత్సాహమును,ఆత్మసమర్పణశక్తిని,పరతంత్రజీవితనిరసనమును, ధర్మసంరక్షణ పరాయణత్వమును గ్రహింపవలయు నన్నను, ఔరంగజేబు మొదలగు మొగలుచక్రవర్తుల నిరంకుశపరిపాలనపద్ధతిని, సామ్రాజ్యతృష్ణను, రాజనైతిక షడ్యంత్రప్రభావమును, హిందూమతద్వేషమును, స్వమతవ్యాపన ప్రయత్నములను, జిజియా మొదలగు నన్యాయపుఁ గప్పములను, హిందువులను బాధించిన రాక్షసకృత్యములను జూడవలయునన్నను, సదాచార నీతిధర్మ శూన్యతచేతను, సర్వసమానత్వము లేకపోవుటవలనను మొగలుసామ్రాజ్య భానుఁడేరీతి నస్తమించినదియు, తదనంతరము వ్యాపారులగు హూణులు కుటిల నీతిచే హిందూమహమ్మదీయులకును, సామంత ప్రభువులకును విద్వేషములఁ బుట్టించి వారి శక్తిని నశింపఁజేసి, తురుష్క హైందవసామ్రాజ్యముల నెట్లు కబళించివైచినదియు రాజ్యాంగ వ్యూహములయొక్క యత్యద్భుతకరములగు చర్యలను గ్రహింపవలయునన్న మనము

తే. దివిరి మును దక్షిణాబ్ధి బంధించినటుల, వచ్చెనో తన్నుఁ గట్టింప వాయుజుఁ డని
తెలివు మది గ్రమ్మి ముత్యంపుచిరులఁ బూజ,లొసఁగుచున్నట్టులున్న దీయుత్తరాబ్ధి.
తే. సహజగుంభితశబ్దముల్ శ్రావ్యములుగ, సహజగాంభీర్యమాధుర్యసహిత మగుచుఁ
గవుల నోరూరఁజేయుసత్కావ్యరీతి, యిక్షురసవార్థి చెలువొందె నింతి కనుము.
ఉ. ఊరక మ్రోయుచుం దెసల నుద్ధతిఁ దుంగతరంగహస్తముల్
బారలు చాఁపుచుక్ నురుఁగుఁ బైపయిఁ జూపుచుఁ దుంపరల్ పడం
బాఱుచు బొంగుచుక్ బయలు ప్రాఁకుచు గట్టులు దాఁకుచుక్ సురా
సీరధి మించెఁ జూడు తరుణీ! జడభావము మాన దెయ్యెడక్. 299
మ. జలకాంతాకబరీభరోజ్జ్వలమిళచ్ఛైవాలనీలప్రభా
వలయోత్తుంగతరంగసంఘవిచలద్వైమానికానీకమై
జలభద్రేభవిహారముద్రితసమంచచ్చంద్రికావర్తమై
చెలువొందెక్ ఘృతవారిరాశి యెదుటక్ సీతాసితాబ్జేక్షణా. 200
శా. ఆకర్ణాంతవిశాలలోచనశతాస్యాదిత్యవిద్విడ్భుజా
వ్యాకృష్టామితపాలనాన్వితము మాయాపట్టణం బున్నత
ప్రాకారోపరిశృంగలగ్నరవిచక్రక్షేమసాక్షాత్కృతే
చ్ఛాకల్పారుణదోఃప్రయాస మదిగో శాకాంతరీపంబునక్. 201
ఉ. దానవలోకనాథునిప్రతాపశిఖల్ వడిఁగ్రమ్మి నిల్చిన
ట్లీనగరంబుచుట్టుఁ దగుహేమపుఁగోట త్రినేత్రుఁ డైనచో
మానిని చక్కఁ జూడ నసమర్థుఁ డనక్ బెఱవారు శక్తులే?
వీనిఁ దృణీకరించి కపివీరుఁడు మారుతి వచ్చెఁగా కిటక్. 202
మ. అతిలోకం బగుదైత్యవానరనరేంద్రానీకముక్ వీఁపుపై
ధృతిగావించి నభోగతిం ద్రిజగదాభీలప్రయాణోద్ధతిక్
జతురంభోధులు దాఁటి శత్రుపురిఁ జేర్చ న్నేర్చు నెవ్వాఁడు? మా
రుతపుత్రుం డవలీల-నింతపని కారోహించెగా కియ్యెడక్. 203
ఉ. నాలుగువారిరాసులు క్షణంబున దీవులతోఁ దరింపఁగాఁ
జాలినయప్రమేయజవశాలికి ముక్ లవణాబ్ధి దాఁటుటల్
చాలబ్రయత్నమే? భువనజాలము లన్నియు నొక్కజంగకుం
జాలునె? కామరూపత పొసంగిననిక్కపిచక్రవర్తికిక్. 204
మ. మన లంకాపురిమీఁదఁ బోవుతఱిఁ నిమ్మూర్తిక్ విజృంభించి ని
ల్చినఁ దద్రావణకుంభకర్ణు లెదురే చింతింప మత్కీర్తిభూ.

జను లెంచఁగ లవణాష్ఠబంధనముఖోత్సాహైకసాహాయ్యుఁడై
తనరెన్ నా కితఁ డాప్తుఁడై తగ ననసాహ్యం బెద్ది లోకంబులన్. 205

క. ఈకడ వింతలు మనము వి, లోకింప జవైకగతిని లోభము వారసెం
గాక మనోజవగమనముఁ, గైకొన సిద్ధివి నిమిషగతి కన్నదియే?! 206

ఉ. బాలమరుచ్చలత్కిసలపాణి చలింపఁ బికాళిరాజికీ
రాళిమృదూక్తిఁ బావని నిజావనిఁ బాదము లూనఁ బిల్చుఁ ప
త్కేకివనాంతలక్ష్మిఁ గిలకించితె? చంచలనేత్ర! యచ్చటం
బాశేము డించి రక్కసులఁ బంపున మర్కజువీఁడు చూడఁగన్. 207

మ. అని రామక్షితిపాలమౌళి సుమనోహారిత్వరంభాషితం
జన మై సంక్రీతదేవవల్లభరమాసంభావితం బైనసం
దనముం బోనిద్విషత్పురోపవనమున్ దర్శించి వాతాత్మజుం
గని సేనాపతి నీడ డించు మని పల్కన్ భూమికిం డిగ్గఁ జోన్. 208

ఉ. అబ్బురమయ్యె నద్దిర యజాండము నిండినదండిమేనితో
గొబ్బున వచ్చుచున్న దొకకోఁతి యటం చురువండపాణు లై
ప్రబ్బినకిన్కఁ బూనువనపాలురు మ్రగ్గగడిగ్గి నేలకున్
డెబ్బదిరెండువెల్వలును డిగ్గెను డిగ్గిరి సైనికాగ్రణుల్. 209

క. ఆరామనృపతి పతితో, నారామ మలంకరించి యర్కజముఖులం
జీరి సురారిమహాపురి,పై రణమున కరుగుఁ డను మఁ బనిచె ననుటయున్. 210

క. విని గౌతమసుతుఁ డిటువలెఁ, బనిచినపతియాజ్ఞ పూని భానుజముఖ్యుల్
చని సురవైరులతో నని, మొనసినపని చెలుపుఁ డనుచు ముని నడుగుటయున్.

ఆశ్వాసాంతము.

చ. అసురహరా! హరాజమహితాత్మ! హితాత్మవిచార! చారణా
ప్రసరదయా! దయారసనిరంజన! రంజనభావ! భావనా
భ్యసనపరా! పరాశరముఖాదర! ఖాదరధీర! ధీరతా
హసితధరా! ధరావనసమాహిత! మాహితబోధ! బోధకా! 212

క. శరణాగతభరణాభ్యా, శరణాహతదూషణాదిశాత్రవ! కరుణా
శరణా! పరిహృతశరధీ!, శరణాకరణాదిదూరసంవిద్ధరణా!. 213

స్రగ్విణి.—

అబ్జపత్రేక్షణా! యార్తసంరక్షణా! యబ్జరేఖాననా! యాశ్రయత్కాననా!
యబ్జకీర్త్యాదరా! యార్యవర్యాదరా! యబ్జసింధూర్భిదా! యచ్ఛబుద్ధ్యాస్పదా!.

గద్య. ఇది శ్రీమదంజనాతనయదయారసలసత్కటాక్షవీక్షామహత్వసంప్రాప్తకవిత్వ విద్యావధాన సగుణనిర్గుణధ్యానవాసనానిధాసమాన సబిసపుష్పపుష్పగిర్యప్పనార్య కుమార సమాశ్రితబుధాచారగురుజనవిధేయతిమ్మననామధేయ ప్రణీతం బైనసమీర కుమారవిజయం బనుమహాప్రబంధంబునందు మైరావణవధయును సత్యలోకగతుం డైన గంధమాదను మరలఁ దెచ్చుటయు లింగప్రతిష్ఠాపనకథయును దత్త్వోపదేశం బు సేయుటయు హనుమత్తీర్థమాహాత్మ్యవర్ణనంబును హనుమద్విశ్వరూపంబును మాయాపురప్రయాణంబును దత్పురోపవనప్రవేశంబునునన్నది చతుర్థాశ్వాసము.

---

శ్రీ రస్తు.

# పంచమాశ్వాసము.



క్షోణీప్రియకన్యా
భీషణలీలామిళిందబృందసరోజా
పేక్షాసఖిలక్షణముఖ!
దాక్షాయణ్యుక్తనామ! దశరథరామా!.

తే. అవధరింపుము భూతదయాగరిష్ఠుఁ, డగువసిష్ఠుఁ డనియె గౌతమాత్మజునకు
విను శతానంద! శ్రీరామవిభునియాజ్ఞఁ గపులొనర్చినకరణము సాంగముగ గాఁగ. 2

ఉ. మర్కటసైనికేంద్రుల సమగ్రబలాఢ్యులఁ జేరఁ బేరునం
జేర్కొని యర్కజాంగదవిభీషణముఖ్యుల నన్యసైన్యసం
పర్కముగా శతాస్యపురిపైఁ బురికొల్పి పరాగపాళిచే
నర్కునిఁ గప్పుచుం గిలకిలార్భటి దిక్కులు వ్రక్కలించుచున్. 3

చ. తరుధరణీధరాశ్మములు దాల్చి సముద్ధతి భూమికోట డ
గ్గఱి నలువంకలం గలయఁగట్టలు పూడిచి కోటఁ గూల్చి గో
పురములు నేల వ్రాల్చి తలుపుల్ బడ ద్రుల్చి యదల్చి పౌరు ల
చ్చెరువడఁ బెచ్చురేఁగి కపిసేన విభీషణసేన హెచ్చినన్. 4

ఉ. ఎక్కడిక్రొత్తిగుంపు లివి యెక్కడిరక్కసిమూఁక లిప్పుడుం
బక్కట! లోకభీకరదశాననపాలిత మౌ పెలుంగవో
చిక్కెనిఁ గెందుఁ బోవు నని సింహనినాదము మేదురంబుగా
నొక్కటఁ గాలకేయు లన నొప్పెడుతత్పురరక్షణక్షముల్. 5

సీ. ఖరకరతారత్సరుత్సురికాశుగసృగాదిబహుసాధనోదగ్రపాణు లగుచు
హయతరక్షుమదేభహర్యక్షముఖసమిత్ప్రౌఢైకవాహనారూఢు లగుచు

స్వచ్ఛవజ్రచ్ఛటోచ్ఛ్రియకంకటచ్ఛవిప్రచ్ఛాదితవ్యోమభాగు లగుచు
ఛీమాట్టహాససంభేదితాశాకుంజరస్వాంతకర్ణాంతరాళు లగుచుఁ
తే. గనుఁగొనలఁ బ్రస్ఫురస్ఫులింగములు చెదరఁ
బెండగుణఘోషణముల బ్రహ్మాండ మగల
గర్జితావర్తకోద్వృత్తిఁ గాలకేయు
లసురి కపిదైత్యనరులపై నడచి రపుడు. 6

క. కాలవ్యాళకరాళ, క్ష్వేళజ్వాలోగ్రత న్నిశితకరవాలా
భీలప్రభ లొరసిన రవి, యాలో నద్దంపుబిల్ల యనఁ గనిపించెన్. 7

చ. పొడుపొడు పట్టుపట్టు మఱె పోయెదు: బోయెదుఁ బోవనీకు మ
న్నొడువుల బెట్టిదం బొదవ నూఱులసంఖ్యలు గుంపులై వడిన్
బుడమి చరింప నిర్జరరిపుల్ కపిసేనలఁ దాఁకి లగ్గలె
క్కుడు గనకుండ బల్లెములఁ గ్రుమ్ముచు రెమ్ముచుఁ బాఱఁజిమ్ముచున్. 8

లయగ్రాహి—
తిట్టుదురు పాదముల మట్టుదురు శూలములఁ గుట్టుదురు మీఁది కెగఁ గొట్టుదురు జాఱన్
నెట్టుదురు పాశముల గట్టుదురు పెన్గదలఁ గొట్టుదురు నేలఁ బడఁ బెట్టుదురు మీదన్
జెట్టులును గట్టులును జట్టులును హస్తములఁ బట్టి వెస వైచి కపులిట్టు నటు పోరన్
జుట్టుకొని యట్టిబలు దిట్టతన ముట్టిపడ నట్టియెడ బిట్టడరి రట్టడి యొనర్పన్. 9

శా. బద్ధస్పర్ధఁ గడంగు దైత్యులమహాబాహాబలాటోపసం
పద్ధాటీపటిమం బిటంబు వహియింపం జాల కుద్భ్రాంతులై
యుద్ధక్షోణిఁ జలించువానరుల నోహో నిల్వుఁడీ యంచు స
న్నద్ధుం డైనవిభీషణుండు కపిసేనన్ నిల్పి సక్రోధుఁ డై. 10

మ. అలఘుగ్రావమహోగ్రకాయుల సురౌఘాజేయులం గాలకే
యుల నీక్షించి స్వసైనికోత్తముల కత్యుద్వృత్తి జే వీచినన్
గలహారంభవిజృంభణోద్ధతి పొసంగన్ వానరుల్ వారితో
దళముల్ గూడిరి తారసిల్లి రట శస్త్రాశస్త్రి నద్దైత్యులన్. 11

శా. ఉల్లోలధ్వజవిస్ఫుటత్పటపటాత్యుగ్రార్భటుల్ దైవహృ
ద్భల్లోద్యత్పటహచ్ఛటాధణధణంధాణంధణల్ శత్రుహా
హల్లోలస్వనముల్ విభీషణబలాధ్యక్షక్షపాటాగ్రణీ
కిల్లిల్లి ధ్వను లెల్లెడం జెలఁగె నేకీభావ మై యయ్యెడన్. 12

శా. సాహంకారనిరంకుశాహవముఖాహంపూర్వికాలాప మై
బాహాబాహికచాకచిం జల మెలర్పం గాలకేయాసుర
వ్యూహంబుం బొదివెం గపిప్రకరము బాహాస్ఫూర్తిమైఁ బోరె హా
రాహారిక్ నిజఘోషనిర్దళితశక్రద్విపఘాగర్భ మై. 13

చ. అగచరు లత్తివైనవిపులాచలశృంగములన్ గణింపకన్
దగిలి మిణుంగురుల్ పొగలు దార్కొనుచుక్కసిమిక్కుటంపుటు
క్కుగవలు మింటితో నొరసికొన్న మహోల్మకశంకఁ జాఱువె
ల్లగజము నొల్లఁ డింద్రుఁ డకలంకవిమాన మలంకరించుచున్. 14

క. కరనఖరచరణవాల, స్ఫురణలఁ గపు లసురవరులఁ బొదివిరి వారున్
శరపరశుకుంతతోమర, కరవాలోద్ధతులఁ గపుల గదిసిరి పోరన్. 15

క. పూనినశరుగిరు లలుఁగుల, చేనొగి చూర్ణములు సేయ సింహధ్వనితో
వానరవీరులు దనుజుల, పై నుఱుకరె కాని చేటుపా టెంచ రటన్. 16

క. చూచి తమ నడవి ద్రిమ్మరి, రాచతికము వైచుజాలు రక్కసిగుంపుల్
డాచేతదట్టివైచిన, ఖేచరులకు మిగులపాడవుకే చనవలసెన్. 17

తే. ఉదుటుఁదనమున హరి యొక్కఁ డెదుటివాని
మదమదావళి మరుదేర నెదిరిలోండ
మూఁది పట్టి చివుక్కన మీఁది కెగసి
కుంభములు వ్రచ్చె నఖముఖోజ్జృంభణమున. 18

సీ. క్రూరాంఘ్రిహతుల దేవారిశతాంగముల్ వారిశతాంగముల్ వ్రక్కలించి
యలవుమైఁ బూర్వదేవాజిసంచారంబు వాజిసంచారంబు వై పడంచి
వడి మీఱి దానవవారణస్ఫురణంబు వారణస్ఫురణంబు తీరు మాన్చి
బలుకినుక శత్రుసంపత్తిప్రాబల్యంబు పత్తిప్రాబల్యంబు పరిహరించి
తే. పోరువానరవీరుల భూరిశక్తి
దాఱి నిల లేక ముందరిబారు విఱుగఁ
గాలకేయాదిదనుజు లాగ్రహము మిగులఁ
గపులపై సేనఁ బురికొల్పి కడఁగుటయును. 19

ఉ. శంక యొకింత లేక కపిసైనికు లుద్ధురసింహనాద మ
భ్రంకష మై చెలంగ జలరాశిపదాహతిజాతధూళిచే
నింక భుజాభుజిం దొడరి రే మని చెప్పుదు నట్టిపోరునన్
బింక మెలర్ప మార్కొనె విభీషణుసేనలు కాలకేయులన్. 20

క. ఈరీతి సైనికవ్యయ, మారూఢమిథోజయార్థమై రెండునెలల్
హోరాహోరిఁ గడంగి య, హోరాత్రము లని ఘటించు చుండెను చోటన్. 21

ఉ. ఆనగరాధినాథుఁడు శతాననుఁ డంతకు మున్న శంకరుఙ్
ధ్యాన మొనర్చుచుండి కలహాన్వితసైనికదుర్భరార్భటుల్
వీనుల సోఁకినఙ్ మది చలింపఁగ నత్తఱి ద్వారపాలకుల్
గానఁబడం బురంబు వెలి గ్రమ్మెను సద్దది యేమి? నావుడున్. 22

ఉ. మ్రొక్కి భయంబు మీఱఁ గరముల్ ముకుళించి పరాకు రా జొకం
డెక్కడివాఁడొ యొక్కకపి నెక్కి నరాసురవానరాళితో
నిక్కడ డిగ్గి రెండునెల లేఁగెఁ గపుల్ మనకాలకేయులుం
దక్కక పోరసాగి రది తద్ధ్వని స్వామి! యటంచుఁ బల్కినన్. 23

క. ఆహా! నాపురిపై కొక, బాహుజుఁ డరుదెంచి కోఁతిబలములతోడఙ్
బాహాబలమున రణస,న్నాహము వహియించె ననిన నగరే లోకుల్. 24

క. ఆజి బిడౌజుఁడు మొదలగు, జేజే లల వుడిగి నన్ను జేజే యనఁగా
నేజాడ వచ్చె నిచటికి, రాజు వనచరులఁ గూడి రణమొనరింపన్. 25

సీ. గుటగుటార్భటుల మిక్కుటపుబెబ్బులి యున్నపొదలేడికొదమలు పొదివినటులు
అడఁగి యూరకయున్న హర్యక్షపతిగుహాంతర మేనుఁగులగుంపు దొరసినటులు
చుట్టఁబెట్టినభోగి పుట్టపట్టున దొట్టి చిఱుతతెమ్మెరలు ద్రిమ్మరినయటులు
కడిఁదిమార్జాల మాఁకటఁ బొంచి యున్నచోఁ జిట్టెల్కగమి తారసిల్లినటులు
తే. మది మది వసించి మత్తులై మచ్చరించి, నన్నుఁ బొదివినదనుజవానరనరాళి
పచ్చిపోల శూలశిఖికీల వెచ్చచేసి, భూతకోటులఁ బరితృప్తిఁ బొందఁ జేతు. 26

మ. అని రోషించి కషాయితాత్ముఁ డయి రక్షోధ్యక్షుఁ డాత్ర్యక్షచిం
తనతో నక్షసరంబు డించి సచివాప్తశ్రేణి మున్సైనవా
రిని సన్నద్ధులు గాఁగఁ బంచి రణభేరీభూరిధాణంధణ
ధ్వని బ్రహ్మాండము నించి యుద్ధకుతుకోద్యద్ధామితధ్వానుఁ డై. 27

సీ. ద్విశతపాణింధమోద్దీప్తాయుధప్రభల్ డాలమేలికచపేటంబు వ్రేయఁ
గరకంకణాంగదగ్రైవేయకాద్యంశువల్లికల్ బ్రహ్మాండ మల్లికొనఁగ
శతమస్తకస్థలాంచత్కిరీటాగ్రంబు లాఁగి నక్షత్రాళి వీఁగ నొత్తఁ
గపటగాఘతమిస్రఘటనాపటుస్ఫూర్తి నిష్ఠురాంగము వొంగి నింగి మ్రింగ
తే. సమరసంరంభసంభృతోత్సాహలీలఁ, గాలనిర్గంధనోత్కంఠకాలకంఠు
నోజ శతకంఠుఁ డుగ్రశౌర్యోపకంఠుఁ, డగుచుఁ బురి నిర్గమించునయ్యవసరమున.

మాలిని.—

బిరుదపటహశంఖాఢక్కాకాహళకా
ద్యురుతరరవధూతాహూతసన్నద్ధవీరా
చరితకహకహావిస్ఫారనిర్భేదితాశా
శరణకరణకర్ణస్థాన యై సేన మించెన్. 29

సీ. ఘోర మై కురియునంగారవృష్టికిఁ దోడు తురగవాలధినిప్పు లురులసాగె
నెడలేక పుడమి రాలెడుతారలకుఁ దోడు కరులకన్నులబాష్పకణము లొదవెఁ
దమయిచ్చ దివిఁ గబంధము లాడుటకుఁ దోడు ఘనపతాకలమీఁద గ్రద్ద లాడె
దళ మైనభూతబేతాళార్భటికిఁ దోడు మదభేరవారాన మెదురుకొనియె

తే. మొనయుమృత్యువునిశ్వాసమునకుఁ దోడు,పరగెఁ బ్రతికూలవాయువు బలముమీఁద
మొఱకుఁదనమున నవి యెల్ల సరకుగొనక, బెఱసురక్కసి యని సేయుకొఱకు రాఁగ.

ఉ. వానిధగద్ధగోద్ధృతసువర్ణకిరీటశిరశ్శతద్యుతుల్
వానివిభూషణోజ్జ్వలదవార్యకరద్విశతాయుధద్యుతుల్
వానిశరీరజృంభణము వానిమదోద్ధతిఁ జూచి జానకీ
జాని శిరఃప్రకంపన మెసంగ మహాద్భుత మంది యుండఁగన్. 31

ఉ. అంత సమీరసూతి నతుఁ డై కరముల్ మొగిడించి స్వామి! యా
ద్యంతవిదూరవిగ్రహుఁడ వవ్యయత త్త్వమ వయ్యు నెంతయుం
జింతగఁ జూడ నేమిటికి? వీఁ డెదురే భవదీయదృష్టికిన్?
జింత దొఱంగి శత్రుహృతి సేయుము నేఁ డని తెల్పి పొల్పుగన్. 32

సీ. శతకోటిమార్తాండచండలోచనములఁ గాలానలజ్వాల గీలుకొనఁగ
దుష్టరాక్షసవంశధూమకేతువుఁ బోలి కాలంబు వియద్వీథి జాలువాఱ
దంతసంఘట్టనోద్ధతవిస్ఫులింగముల్ నెఱసి దిక్కుల నెల్ల నిండుకొనఁగ
నుచ్ఛ్వాసపర్యాప్తహుంహుంక్రియార్భటు లెదిరిమూఁకలగుండె లదరఁజేయ

తే. నిడుద యై వచ్చి యదలించి పిడికిలించి, హనుమ కట్టల్కతో నిదె తిను మటంచు
నడుగుబెడిదంపుఁదాఁకులఁబుడమి వడఁకఁ,బొడిచెవడిమించి శతకంఠు వెడఁదఱొమ్ము.

చ. పొడిచినపోటున న్మొగిలి భూమిని ద్రెళ్ళి ముహూర్తమాత్రముం
గడచిన లేచి కట్టెదుట గంధవహాత్మజుఁ గాంచి మారుతీ!
కడుబలశాలి వౌదు త్రిజగద్భయదాంగుని నన్ను నొంచె నీ
పిడికిటిపోటు బెట్టిదము పేరొకఁన శక్యమె? వానరోత్తమా!

శా. ఈలోకంబున నెల్లఁ ద్రిమ్మరితి దేవేంద్రాదిదిక్పాలకుం
ఘోళిం గెల్చితి నింతవాఁడ నయితిన్ శోధించితిన్ వీరులన్
నీలీలన్ నను నొంచువాని నెఱుఁగన్ నీముష్టి నేఁ గంటి మ
చ్ఛాలం బెట్టిదొ నీవు గన్గొనుమటంచుం జేర్చి పెల్లార్చుచున్ 35

మ. తనకంటెం బొడ వైనశూలము సమస్తద్వేషిహృచ్ఛూల మం
జనపుత్రుం గని యూఁచి వైచిన మహాసంవర్తకావర్తక
స్తనితోద్వర్తనవిస్తృతాశనిశిఖిజ్వాలాకరాళప్రభన్
జనుదేరన్ దృణలీలఁ బాదహతిఁ ద్రుంచం దైత్యుఁ డత్యుద్ధతిన్. 36

ఆ. మేలు మేలు నిన్ను మెచ్చితిఁ గొను మంచు, ద్విశతబాహుభరితదీర్ఘముసల
పరశుభిండివాలకరవాలముఖసాధ, నములు వైవ హనుమ నడుమఁ ద్రుంచె. 37

శా. ఆవేళన్ రఘునేత మారుతిశరీరాటోపమున్ దద్భుజా
ప్రావీణ్యంబును గాంచి సంతసిలి యూపైనుండి క్రిందైన ర
క్షోవీరుం గనుగొంచు లక్ష్మణుని చేఁ గోదండముం దాల్చి త
జ్జ్యావల్లీధ్వను లెల్లెడన్ నిగుడఁ జేయన్ దాయ యుగ్రాకృతిన్. 38

మ. కుటిలభ్రూకుటులున్ బ్రకోపవశదృక్కోణస్ఫులింగస్ఫుట
స్ఫుటలుం గ్రూరరదచ్ఛటాగిటగిటస్వానస్ఫుటాస్యజ్వల
చ్చటులజ్వాలలు నట్టహాసములు మించం జండబాహాశతో
ద్భటకోదండవిముక్తకాండములు నింపన్ రాముఁ డత్యుద్ధతిన్. 39

క. దోర్జవమున నలినిజధను, రూర్జితవిశిఖములఁ దునిమి యురవడి చూపన్
గర్జించుచుఁ దర్జించుచు, భర్జించుచు నసురవరుఁడు బవరము చేసెన్. 40

శా. శంకాతంకము లేక యప్పుడు రణోత్సాహంబు వాటించి య
ప్పంకేజాప్తజుఁడున్ విభీషణుఁడు పైపై శైలశస్త్రాదు లి
ర్వంకం గప్పినఁ ద్రుంచి పాదహతిఁ బాఱం జిమ్మినన్ దిమ్మునన్
లంకాద్వీపములోనఁ గూలి రిరువు ర్లజ్జాకులస్వాంతు లై. 41

ఉ. ఆలములోన నున్నమరుదాత్మజుఁ డాకడనుండి యాకడన్
వ్రాలినవారిఁ జూచి దనవాలము చాఁచి చతుఃపయోధులన్
వేలమ కట్ట గట్టి యొదవించెను దత్పునరాగమార్థి యై
వాలధిసేతుమార్గమున వచ్చిరి వా రతనిన్ నుతించుచున్. 42

సీ. సర్పివార్ధివిశాలశైవాలభూమిళన్నీలపాళీనిగన్నిగలఁ గలసి
హాలాంబుధితరంగడోలాంబుబాలికాతాటంకమణిధగద్ధగల నొరసి

యిక్షుసాగరగర్భరక్షితామృతదంతిదంతావళీతళత్తళల నొలసి
క్షారపారావారశకులపుచ్ఛోత్క్షిప్తమకరతోద్యచ్చకచ్చకల జెరసి
తే. సకలలోకాద్భుతక్రియాజనకశక్ర, చాపకర్బురవైభవోద్దీప మగుచు
ద్వీపవాసులు భయ మంద దీర్ఘలీల, వాలసేతువు చెలువొందె వనధులందు. 43
క. వదలఁడు సమరోదగ్రతఁ, గదలఁడు తా నున్నచోటు గగనాంతరమున్
దుదగన్న మేనితో నతఁ, డుదధుల్పై వాలసేతు వొదవించు నెడన్. 44
క. రూపింపవసమె హృదయ, వ్యాపారము లీల వాలవల్లిక సకల
ద్వీపము లబ్ధులు క్షణమునఁ, బ్రాపించె నటన్నఁ దత్ప్రభావ మొరులకున్. 45
ఉ. అంత నభస్వదాత్మజదయాగతి నిట్లురు వెంచుటన్ రమా
కాంతవిభీషణుల్ రిపునిఁ గ్రమ్మఱఁ గ్రమ్మినదొమ్మిగాఁ గపుల్
చెంతలవృక్షముల్ గిరులు చేకొని శత్రునిమీఁద వైవ వాఁ
డింతలు నింత లై తునియ సేసె శితాస్త్రపరంపరాహతిన్ 46
ఉ. అందఱిశైలజాలము నిజాంగమునం దుము లై ధరం బడం
గొందఱఁ బాదఘట్టనలఁ గొందఱ బాహుమహోగ్రహేతులన్
గొందఱఁ బార్ష్ణిఘాతములఁ గొందఱ జానుల బెట్టిదంబుగన్
గొందఱ ముష్టిసంహతులఁ గూల్చెఁ గపీంద్రులు కాందిశీకు లై. 47
సీ. సంగ్రామమున నిల్వఁజాలక పగవాని కంగదుం డై పాఱె నంగదుండు
పరిపంథినిశ్వాసపవమానహతిఁ జన్నసలనామ మిరవయ్యె నలున కప్పు
డరిఖడ్గహతిఁ దూలి యంతరిక్షమునందు నీలలీల వహించె నీలుఁ డంత
రిపుదేహదీప్తి పర్విన మింటఁ గళలేని ఋక్షరాజన నిల్చె ఋక్షరాజు
తే. రంభుఁ డలరాకగతజయారంభుఁ డగుచు, స్వేదుఁ డురుసాధ్వసోద్భవస్వేదుఁ డయ్యె
ముక్తుఁ డాజిక్రియోద్యోగముక్తుఁ డయ్యె, వంభుఁ డాక్రాంతడంభుఁ డై దాఁగియుండె.
ఉ. చెప్పెడిదేమి వానరులు చిక్కినవారలు తత్పదాహతిం
గుప్పలు కుప్ప లై పడిరి కూలె విభీషణుసేన భూమిపై
నప్పుడు కాలకేయబల మంతముఁ జెందె రఘూత్తమానుజుల్
ముప్పిరిగొన్నకోపమున ముప్పిరఁ దాఁకిరి రాక్షసేంద్రునిన్. 49
ఉ. తాఁకి భయంకరాంబకకదంబవిశాలకృశానుకీలలం
గాఁక యొనర్ప దర్పమునఁ గన్నుల నిప్పుక లుప్పతిల్లఁ జే
రాఁకలిగొన్న సింహము సటాగ్రము లూఁచినఁ దోఁచునాకృతిన్
వీఁక నెదిర్చె రాత్రిచరవీరవరేణ్యుఁడు వారి మువ్వురన్. 50

